అరుణ ప్రచురణ హక్కులు రచయితవి
రూపాయి ప్రథమ ముద్రణ 1944

ప్రచురణాధిపతులు.
వెరైటీ ఏజన్సీస్,
పబ్లిషర్స్ అండ్ బుక్‌సెల్లర్సు,
గవర్నరుపేట ★ బెజవాడ.

రినైసాన్సు ప్రింటర్సు లిమిటెడ్, మద్రాసు.

చలంగారు ఆంధ్రలోకంలో పేరెన్నికగన్న కథకులు. వారి రచనలు యువకులకు ప్రాణప్రదమూ, వృద్ధులకు ప్రాణోప్రదవమూగా ప్రఖ్యాతి పొందాయి. మానవజీవితాలకు ప్రతిబింబాలుగా వుండే కథలు రచించడంలో, సహజమైన, సజీవమైన సంభాషణలు వ్రాయడంలో, చలంగారు అసమానులు. విడాకుల కథలో మానవజీవితాలను స్వర్గధామాలగానో, నరకతుల్యాలగానో చేసే స్త్రీ పురుష ప్రేమతత్వం విశాలదృష్టితో చిత్రించారు. స్త్రీ పురుషుల హృదయాలను బంధించేది పవిత్రప్రేమగాని, వివాహ తంతువు కాదని వాదించారు. అటువంటి ప్రేమతత్వాన్ని విశాలదృష్టితో, చిత్తసంస్కారంతో అర్థంచేసుకుని, జీవితాలకు సమన్వయం పరుచుకోవడంలోనే జీవితసౌఖ్యము ఇమిడియున్నదని నిరూపించారు, మూఢసంఘాచారాలతో, సంకుచిత స్వభావులై పోయి నందనోద్యానములుగా ఉండ

వలసిన జీవితాలను చేతులారా కీకరారణ్యాలుగానూ, ఎడ లేని ఎడారులగానూ, నరకకూపాలగానూ, చేసుకుంటున్నారని వాదించారు. ప్రేమలేనిచోట వివాహక్రతువు హృదయాలను బంధిపలేదనీ, ఆజంట కలిసివుండి భూలోకనరకం అనుభవించేకంటె విడిపోవడమే ఉత్తమమని సూచించారు. స్త్రీ పురుషుల హృదయాలకు నిశ్చల నిర్మలప్రేమ బంధమేర్పడినపుడు సంఘము సాటి కలయికకు అంతరాయము కలిగించడం ఘోరపాపమని నిర్ధరించారు.

భారతజాతి నూతనచైతన్యంతో ప్రజ్వలిస్తూ వికాసానికీ, వెలుగుకూ తహతహలాడుతున్న యీ తరుణంలో, భారతదేశం నూతనాకారము పొందబోతున్న యీ సమయంలో, సంఘానికి నూతనసందేశాన్ని ప్రసాదింపగల 'విడాకుల' వంటి కథలే చిత్రాలుగా తయారుకావాలి. మనప్రొడ్యూసర్లు పాతమార్గాలువదిలి జాతిని ముందుకు నడపగల చిత్రాలవైపుదృష్టి మరల్పగలిగితే 'విడాకుల' కథ అమూల్యమైనదిగా వారు గ్రహింపకపోరు.

తెలుగు సినిమా-సంపాదకులు

★

## మహిళా ఉన్నత పాఠశాల.

[పూజామందిరం, స్కూలుపిల్లలపూజ.

ముందు లలిత వీణపాట.

లలితకు 17 యేళ్లు. ఆమె అందం పురుషుల అనుభవానికి superior గా కనబడుతుంది. భక్తిపరురాలు, నవీన సాంప్రదాయాలు ఆమె వేషంలో యేమాత్రమూ కనబడవు. పురాతన సాంప్రదాయాలూ ఎక్కువలేవు.

తర్వాత పిల్లలందరూ కలసి సరస్వతీ స్తోత్రం.

పిల్లలందర్నూ తోటలోకి వెళ్లుతున్నారు. గోడలకు ఋషులూ, పురాణపురుషుల గాథలూ, దేశనాయకుల పటాలూ.

పిల్లల అల్లరి.

★ ★ ★

రాత్రి, వెన్నెల. లలితా, చంపక అనే class-mates డాబా మీద నుంచున్నారు. కొంచె దూరంగా పట్టణపు electric lights కనబడుతున్నాయి]

చంపకం: దిగులు పడకోయ్! ఎల్లుండి మీ అమ్మనీ నాన్న గారిని చూడగానే మమ్మల్నందర్నీ మరిచిపోతావు.

లలిత: అదికాదు చంపకా! నా మనస్సంతా సంఘసేవమీద వుంది. సంస్కారం చెందిన మన స్త్రీలు దేశసేవకై జీవితాన్ని వినియోగించాలి. పిల్లలు కనేందుకు తేరా స్త్రీలు? మనమూ అంతేనా?

చంపకం: దేశసేవా! దేశాన్ని సృజించినవాడే దేశాన్ని సంస్కరించుకుంటాడు. నాకు మాత్రం ప్రేమించే భర్తా, చక్కని పిల్లలు, ధనం దొరికితే చాలు.

లలిత: ప్రేమించగలభర్త దొరకవద్దా! దొరక్కనేగా పశ్చిమ

దేశాల్లో అన్నీ దైవప్పులూ, మనదేశంలో ఇన్ని సంసార విచ్ఛిన్నాలు.

చంపకం: ఇక్కడకూడా మనవాళ్లు ప్రయత్నిస్తున్నారుగా! విడాకులచట్టం అమల్లోకి తేవడానికి.

లలిత: (కోపంగా) ఒకభర్తని వదిలి, ఏకారణంచేతనన్నాగానీ,— ఛీ! మన పుణ్యభూమిలో, హిందూ పవిత్ర సంసారాల్లో అటువంటి పరిస్థితులు వ్యాపించాయా, యిక పాతివ్రత్యమే నశిస్తుంది.

[పిల్లలు గుంపులుగా వచ్చారు]

పిల్లలు: లలితా! లలితా! యిక్కడ ఉన్నారా? యీ చివరరాత్రి అయినా మా అందరితో గడపగూడదా అమ్మా!

[అల్లరి, నవ్వులు, ఆటలు]

★ ★ ★

[మధ్యాహ్నం. తోటలో చెట్లక్రింద బల్లలముందు స్కూలుపిల్లలు "టీ" తీసుకుంటూ ఉన్నారు. రేడియోసంగీతం! లలిత ఒకొక్కరదగ్గరకేవెళ్లి శలవు తీసుకుంటోంది. తోటలో ఒకమూల ప్రిన్సిపాలు మాట్లాడుతోంది.]

ప్రిన్సిపాలు: లలిత వెళ్లిపోతే మన మధ్యనించి, సగం సంతోషం, ఉత్సాహం, వెళ్లిపోయినట్టుంటుంది. కాని యీ విద్యాలయంలో, యిన్నేళ్లు శిక్షణ పొందినందుకు ప్రతిఫలంగా యీ సంస్కారం, లోకానికి మీరందరు నలుదిక్కులా ప్రతి సంసారంలోనూ వ్యాపింప చేస్తారని గదా మా ఆశయం! సీత, చంద్రమతి, సావిత్రి మొదలైన సాధ్వీమణులకు ప్రసిద్ధికెక్కిన యీ పురాతనదేశం యీనాడు సమస్తవిధాల అధోగతిలోకి దిగిపోయింది. మనదేశానికి పూర్వౌన్నత్యం తీసుకురావడానికి ప్రతి విద్యావతి అయినస్త్రీ నడుం కట్టుకోవాలి. తమశీలంచేత,

పాతివ్రత్య మహిమచేత, రాముల్ని, హరిశ్చంద్రుల్ని, సత్యవంతుల్ని, శివాజీల్ని, రాణా ప్రతాపుల్ని సృజించాలి. మహావీరులు, స్వార్థత్యాగులు, దేశోపకారపారీణులైన పిల్లల్ని, కనే వీరమాతలు కావాలి. నాకు మొదటినుంచి లలితమీద అపరమితమైన ఆశ వుంది. లలితమూలాన యీ విద్యాలయానికి, యీ దేశానికి మహోన్నతమైనకీర్తి వస్తుందని నా గట్టి నమ్మకం. తనపిల్లల్ని యీ విద్యాలయానికి లలిత పంపగా చూడడానికి ఉంటానో లేదో నేను. మనమందరము ఆమెకు మనఃపూర్వకమైన వీడుకోలు ఇచ్చిపంపుతున్నాము (Cheers).

[లలిత ప్రిన్సిపాలు పాదాలమీద వాలింది. సామానులు బయట కారులో పెట్టారు. లలిత కారుఎక్కి వెళ్లిపోతూన్నది. లలిత దిగులుగా ఉంది.]

★ ★ ★

[లలిత రైల్లో సెకండుక్లాసులో ఎక్కింది. లలిత దిగులుగా, వూరు దూరమవుతూంటే చూస్తూంది........రైలు ఒకస్టేషన్‌లో ఆగింది. ఎదురుగా రెండో పట్టాలమీద యింకో రైలువచ్చింది. లలిత పెట్టికి ఎదురుగా ఇంటరుక్లాసు పెట్టెలో రమణ కూర్చున్నాడు. అతని పక్కన పోలీసులు.

రమణ లలితను చూడగానే తన సంగతే మరచి గభాలున రయిలు దూకాడు. పోలీసులు వెనక్కి మర్యాదగా పిలచి కూర్చోపెట్టారు. అక్కడినుంచే లలితా! లలితా! అని కేకవేశాడు. లలిత గుర్తుపట్టి తన పెట్టె దిగి అతని దగ్గరకు వెళ్లింది.]

లలిత: ఇదేమిటి?

రమణ: ఇదీ—దేశసేవలో అలసిపోయినానని యీ మిత్రులు విశ్రాంతికై నన్ను తీసుకొని వెళ్లతున్నారు.

[పోలీసులు నవ్వుతారు]

లలిత : నువ్వానా ? రమణా ! నా చిన్నప్పటి మిత్రుడికి నీ కింత గౌరవం కలిగిందని నా కెంత గర్వంగా ఉందనుకున్నావు ? ఎంతకాలం ?

రమణ : రెండేళ్లు.

లలిత : రెండేళ్లే ?

రమణ : నువ్వెక్కడికి ?

లలిత : ఇంటికి.

రమణ : తర్వాత ?

[రైలు కూసింది లలిత దిగుతోంది.]

లలిత : తర్వాత నాన్నగారికి తెలియాలి,

[రమణారావు ఏదో చెప్పబోతున్నాడు. రైలు కదిలింది. రమణ ప్రయత్నించి కష్టంగా "నన్ను మరచిపోకు" అన్నాడు. ఆ మాటలు లలితకు వినబడలేదు. ఇద్దరూ ఒకరినొకరు వీలయినంతదాకా చూచు కుంటారు.]

[విధి కన్నీరు వదిలింది.]

★ ★ ★

[ఆ పల్లెటూరుకంతా చెంచురామయ్యగారి భవనం పెద్దది జమీం దారుగారి మేడతప్ప. ఉదయం మేడమీద గది. దుర్గమ్మ, లలితా.]

దుర్గమ్మ : ఇదేం పిల్ల ! పెళ్లి వద్దంటుంది, అందులో లక్షణమైన సంబంధం.

లలిత : సంబంధం మంచిదేలే, నా కసలు——

దుర్గమ్మ : వూరుకుందు ! ఎప్పుడూ అదే గోల. కింద ముహూర్తం నిశ్చయమవుతుంటే పైన నువ్వీ గోల.

[కిందినుంచి వూరిలోని పిల్లలు లలితా ! లలితా ! అని కేకలు వేస్తు న్నారు. లలిత సంతోషంతో కిటికీదగ్గరకు వెళ్లింది.]

దుర్గమ్మ: లలిత! లలితట! ప్రతివాళ్లకి చనువే యీ పిల్ల!

[లలిత క్రిందకి పరుగెత్తుకెళ్లింది. పిల్లలు చుట్టూ మూగి లాక్కెళ్తున్నారు. లలితతో ఒక కుక్కపిల్ల. చింత చెట్టుకు ఉయ్యాల ఉంది, ఊగుతారు. లలిత చిన్నపిల్లల్ని ఎత్తుకుంటుంది. తోటవాడు పురుగుల్ని చంపుతూంటే సహించదు. కుక్కపిల్లని అతిగారాబం చేస్తుంది. సీతాయమ్మ వచ్చింది.]

సీతాయమ్మ: అమ్మా! లలితా! యెన్నాళ్లకి చూశానమ్మా నిన్ను! ఎంత ఎదిగావో! మా రమణ ఇప్పుడు నిన్ను చూస్తే— (కన్నీళ్లతో) వాడేదో గొప్ప ఉద్యోగాలుచేసి సంపాయించి పెడతాడనుకుంటే, విన్నావు కాదూ—

[జైలులో రమణారావు, ఎక్కడ చూచినా లలితే]

లలిత: మీ అబ్బాయి ధన్యుడు, దేశవీరుడు, అతన్ని తలుచుకొని మీరు గర్వపడాలి. ఆయన్నికన్న మీరు వీరమాతలు కదా!

సీతాయమ్మ: యిక్కడే, యీ తోటలోనే ఆడుకునేవాళ్లు మీరిద్దరు, జ్ఞాపకం ఉందా?

[లలిత, సీతాయమ్మ ఇద్దరూ చిన్నప్పటి దృశ్యం చూస్తారు]

సీతాయమ్మ: యెప్పటికొస్తాడో యేమో! ఎప్పుడూ నీ సంగతే, అన్నం దగ్గరా నిద్దర్లోనూ నీ సంగతే, చివరకు జైలుకు తీసుకెళ్లేప్పుడుకూడా నీ సంగతే.

[దుర్గమ్మ పిలుస్తుంది.]

దుర్గమ్మ: అమ్మాయి! పట్నంనుంచి పిలిచొచ్చారు.

[లలిత సీతాయమ్మగారు వెళుతున్నారు. మేడమీద బంగీలు విప్పి కొత్తచీరెలు, నగలూ చూస్తున్నారు, వెంచురామయ్య, దుర్గమ్మ బంధువులూ.]

దుర్గమ్మ: యిది అప్పగింతలపీటమీదికి.

[సెంచురామయ్య చంద్రహారం లలితమెడకి పెట్టి అందం చూస్తున్నాడు. సీతాయమ్మను అందరూ అసహ్యించుకుంటారు. లలిత వాటినిచూచి చాలా ఆనందిస్తున్నది.]

సుందరి: లలితా! లలితా! యీ రవ్వలడ్డిగె చూడు. ఎంత అదృష్టమే నీకు!

[లలిత వాటినిచూచి చాలా ఆనందిస్తూంది. పాడుతూ సీనయ్యగారు వస్తున్నారు.]

సుందరి: నాకీ చీరపెడ్తారు? ఇంకేం అక్కర్లేదు. లలితా! ఇది ముహూర్తంరోజున మీ ఆయనకి. యీ చిలకలు చూడవే అంచుమీద.

[లలిత ఆపాట విని తలుపువేపు చూస్తూన్నది.]

దుర్గమ్మ: జ్ఞాపకంలేదూ! ఆ సీనయ్యే. యిట్లాచూడు. యీజాకెట్టు-

[లలితదృష్టి అక్కడలేదు. సీనయ్య వచ్చాడు. లలిత వక్కగంతేసి ఆయనమీదికి పోయింది.]

సీనయ్య: మా అమ్మే! మా తల్లే! మా బంగారుబొమ్మే! యేదీ! యేదీ! చూడనీ యీ పాపిష్టికళ్లు పావనంకానీ! పార్వతీదేవి మాతల్లి రూపాన సాక్షాత్కరించింది. యీవూరికి దేవత అయి.

[లలిత చాలా సంతోషం కనబరుస్తున్నది.]

లలిత: ఇంకా పటికి బెల్లంముక్కలు పంచిపెడుతున్నావా? యేవీ? చూడనీ! యేది నీ పైపంచ?

[సీనయ్య నవ్వుతాడు]

లలిత: నాతో చెమ్మచెక్క ఆడుతావా? రా!

సీనయ్య : యిప్పుడెక్కడ వుందమ్మా ఆ వోపిక ! నీ పెళ్లి నా కళ్లతో చూస్తాననుకోలేదు.

[ఆ గదిలోనించి బట్టలూ నగలూ తీసుకొని అందరూ వెళ్లిపోతున్నారు.]

లలిత : నాకు పెళ్లిచేసుకోవాలనిలేదు.

సీనయ్య : చేసుకోక దొరసానులు మల్లే జుట్టు కత్తిరించుకొని——

లలిత : దేశసేవ చెయ్యాలనుకుంటే——.

సీనయ్య : దేశసేవకుల్ని కనమని దీవిస్తున్నా. హిందూమత పునరుద్ధారకుల్ని, నలుగురు వివేకానందస్వాముల్ని కను. వీరమాతవుకావాలి తల్లీ నువ్వు.

లలిత : అట్లాంటిపిల్లల్ను కని పెంచగలతల్లుల్ని వెయ్యిమందిని తయారుచేస్తాను.

సీనయ్య : హిందూ సాంప్రదాయానికి విరుద్ధమమ్మా అది.

లలిత : సాంప్రదాయాలకి నా జీవితాన్ని బలి యివ్వనా ?

సీనయ్య : బలి యివ్వడమేమిటి ? ఎవరుచెప్పారు ? పిచ్చిమాటలు. అందులో గొప్పభూస్వామి దేశభక్తుడిగారి భార్యవు కాబోతుంటివి.

లలిత : ఆయన్నెరుగుదువా ?

సీనయ్య : నేనేమెరుగుదును ? ఆయన ఐశ్వర్యానికి నా బీదభక్తికి కుదరదు.

సుందరి : దర్జీవచ్చాడు. రమ్మంటున్నారు నాన్నగారు.

[వెళ్లుతున్నారు.]

[లలిత కాలువిరిగిన పిట్టకి తిండిపెడుతూ ఉన్నది. చుట్టూ వూరి బీదపిల్లలు, బంధువులు, పెద్దవాళ్లు, పిల్లలూ వచ్చారు.]

1 బంధువు : లలితా ! నేను జ్ఞాపకంలేనుటే ? మీ అమ్మకి పినతల్లి మేనల్లుడి భార్యని. వీళ్లు నాపిల్లలు, దిక్కులేనివాళ్లనిచేసి వీళ్ల నాన్న బైరాగుల్లో కలిసిపోయినాడుగా.

1 పిల్లవాడు : యిదేమిటి ? పాడుపిట్ట యిదెందుకూనీకు ?

2 పిల్లవాడు : [గదిలో పెద్దబొమ్మను తీసుకొచ్చి] పిన్నీ ! పిన్నీ ! యిది నా కియ్యవూ ?

3 పిల్లవాడు : అత్తయ్యా ! యీ జాకెట్టు నేను వేసుకోవద్దూ?

1 బంధువు : మాలలిత మళ్లీ యిట్లా లక్ష్మీదేవి అవతరించింది. నీతోనే వుంటానమ్మా !

1 పిల్లవాడు : ముసిలిదానివి నువ్వెందుకు? అక్క నన్ను తీసుకెళ్తుంది.

1 బంధువు : నువ్వురా !

ఇంకో బంధువు : నన్ను నీ చేతులతోనే సాగనంపమ్మా ! నీకంటే, దగ్గరవాళ్లెవరూ !

1 బంధువుపిల్ల : నేనూ అక్కయ్యతోనే వుంటాను. అమ్మా ! నువ్వుపో ! నేసురాను.

మరొక బంధువులపిల్ల : పిన్నీ ! పిన్నీ ! నన్ను తోడపెళ్లికూతురు నేను ఎంచక్కా——

[లలిత బీదపిల్లలకు బిస్కట్లు మిఠాయిలు పంచుతుంది.]

1 బంధువులపిల్ల : వాళ్లకెందుకు అక్కయ్యా ! అవన్నీని.

2 బంధువులపిల్ల : అయ్యో ! ఎంత సామగ్రి తగలేస్తుందో, దీనికి పిచ్చికాదు గదా !

3 బంధువులపిల్ల : పొమ్మను ! మురికి వెధవలు వాళ్లు పొండి, పొండి !

బంధువులవిధవ: వాళ్లేమన్నా నీకు చుట్టాలా? పక్కాలా? వాళ్ల కిస్తావేమిటి? మా లక్ష్మిడికిచ్చినా కడుపునిండా తింటుంది.

బంధువులపిల్ల: మాకిస్తే చేదా?

[దుర్గమ్మ వచ్చింది.]

దుర్గమ్మ: ఇదేమిటి? యింకా యిట్లానే ఉన్నావు? సుందరీ! వీళ్లంతా యేమిటి? పొండి, పొండి!

[లలితను గదిలోకి లాక్కెళ్లింది. సుందరి వచ్చింది]

దుర్గమ్మ: పూలేవే?

[సుందరి పూలకోసం పరుగెత్తింది.]

దుర్గమ్మ: [లలితతో] యిదేం ముడి! రేగిసట్లు యిట్లావేసుకోడం? ఎక్కడ నేర్చుకున్నావు? మరీవేషాలు. ఎవరన్నాచూస్తే యీ పిల్లకి జుట్టు దువ్వేవాళ్లే లేరనుకుంటారు; [జుట్టు విప్పుతుంది.]

[సుందరి పూలు తెచ్చింది. దూరాన మేళాలచప్పుడు, సుందరి కిటికీ వద్దకు పరుగెత్తింది.]

దుర్గమ్మ: సుందరీ! నువ్వు లలితకు ముడివెయ్యి, నేను వంటింటి కెళ్లాలి.

[దుర్గమ్మ వెళ్లింది. సుందరి ముడిసంగతి మానదు. కిటికీలోంచి చూస్తుంది.]

సుందరి: వస్తున్నారు! వస్తున్నారు! లలితా రా! రా!

[లలిత కదలదు. సుందరివచ్చి కొంచెంగా సిగ్గుపడే లలితను కిటికీ దగ్గరకు లాక్కుపోతుంది.]

సుందరి: రా! సిగ్గుపడకు. యిక్కణ్ణించి కనపడతారు. ఆ మోటార్లు, కుక్కలు. గుఱ్ఱాలు, జవాన్లు అదుగో చూడు! అటువేపు ఎవరో చెప్పుకో! తెలీదా! నీ హృదయమే చెప్పాలి నీకు. చెప్పనా? అటువేపు ఆ నీలంకోటుబాపున్నాడా? ఏం మాట్లాడు.

లలిత : కాదు. వేళాకోళం చేస్తున్నావు.

సుందరి : యేమమ్మా! నంగనాచితనం. యేం అందంగా లేదా ?

పడెయ్యి మీద, ఆపువ్వు పడెయ్యి.

[సుందరే ఆపువ్వు పడేసింది. లలిత పరధ్యాన్నంతో కదల్లేదు. సుందరి చప్పున లోపలికివచ్చింది. మీద పువ్వుపడి మోటారులోనుంచి రామారావు తలెత్తి లలితనుచూచి చిరునవ్వుతో అంగీకరిస్తాడు. లలిత అతనివంకే చూట్టంలేదు.]

సుందరి : యీపాటికి రా! చాల్లే.

[లలిత వచ్చింది.]

సుందరి : నచ్చాడా ?

లలిత : యేమో! యేంతెలుస్తుంది ?

సుందరి : ఎంత సరసుడనుకున్నావు. ఎప్పుడూ షికార్లూ, స్నేహితులూ, వేట. పట్నంలోనే ఏటికి పదినెల్లు కాపరం. ఒకరిద్దరు వున్నారనుకో [ఆడవాళ్లని సూచన] ఒకలేడీ లెక్చరర్, ఒక బోగంది. [లలిత తెల్లబోయి చూస్తుంది] ఇంక అందర్ని వదిలి వేస్తాడులే! ఏం అదృష్టమే. గుర్రాలూ, మోటార్లు, సినీమాలు, నీకేమే.

[సుందరి జుట్టు ముడివేస్తుంది. సీతాయమ్మవచ్చింది. లలిత "రండి రండి" అన్నదిగాని ఆలోచనలోనే వున్నది. సుందరి లోపలికి వెళ్లింది. లలిత చప్పున ఆమెవైపుతిరిగి—]

లలిత : పక్కసంగతి చెప్పరూ! ప్రేమంటారే భర్తమీద ఏమిటది ? పెళ్లిచేసుకోకముందు ప్రేమకలగాలా ?

సీతాయమ్మ : [ఆలోచిస్తూ] వింతప్రశ్న! ముందో వెనకో ప్రేమ కలగాలి. ప్రేమలేని వివాహమంత నరకం ఇంకలేదు. ప్రేమ ఉంటే అంత స్వర్గమూలేదు.

లలిత : ప్రేమ కలిగిందో లేదో ఎట్లా తెలుస్తుంది ?

సీతాయమ్మ : తెలీదా ? వెయ్యిసూర్యులు వక్కసారి వెలిగితే ఎట్లా వుంటుంది కళ్లకి ? యీ కనపడే ప్రపంచంలో వస్తువు లన్నిటిమీదా యీ మామూలు పాతదనంపోయి అన్నీ అద్భుతంగా తేజరిల్లుతూవుంటే; ప్రతిపనికీ, ఆలోచనకీ, జీవించడానికే గొప్ప ఆనందమయమైన అర్థంగలిగితే యెట్లా ఉంటుంది ?

లలిత : [ఆలోచిస్తూ] నా కట్లాలేదు.

సీతాయమ్మ : ఆతన్ని యెరుగవుకదా ! చూడనేలేదుకద యింకా !

[సుందరి పరుగెత్తుకుంటూ వచ్చింది]

సుందరి : యింకా రావేమిటి ? కాచుకుని కూచున్నారు.

[పెళ్లికూతురు, పెళ్లికొడుకు ఎదురుగా కూచుని చూచుకుంటున్నారు, చుట్టూ పెద్దలు.

* * *

లలిత పూజచేస్తుంది. పాట.

చాలాసేపు పార్వతికేసి చూస్తుంది, ప్రశ్నలు అడుగుతున్నట్టు అడావిడిగా పనులుచేయిస్తూ దుర్గమ్మ అట్లా వెళ్లుతోంది.]

లలిత : అమ్మా ! మాట.

[దుర్గమ్మ ఆగింది]

దుర్గమ్మ : యేమిటి ? అట్లావున్నావు. నీకేం జబ్బుటే ! ఇంత సన్నాహం చేసింతర్వాత కొంపముంచి పెళ్లిని ఆపించవుకద !

లలిత : ఆపించగలగడంచేతనైతే బాగుండును. [కంఠంమార్చి] అమ్మా నాకో సందేహంపట్టుకుంది—ఆయన —

[దుర్గమ్మ నవ్వుతోంది]

దుర్గమ్మ : అయితే ?

లలిత : నిజమేనా ?

దుర్గమ్మ : వుత్త అబద్ధాలు.

లలిత : కాదులే.

దుర్గమ్మ : నిజమైతేమాత్రం ? లేకపోతే పాతికేళ్ల మొగాడు. ఏం లోటు ? డబ్బా - అందమా? నీ కోసం జపంచేస్తూ కాచుకుని కూచున్నాడు అనుకున్నావా ? అయినా చిన్నపిల్లవి నీకీ విషయాలన్నీ యెందుకు ?

[లలిత కష్టపడుతోంది మాట్లాడ్డానికి.]

లలిత : మరి నేనేకదా బతుకంతా సంసారం చేయవలసింది. నాకు కాదా ?........మరి వాళ్లంటే ఆయనకి నేనెందుకు ?

దుర్గమ్మ : పెళ్లిఅయిన తర్వాత ఇంకా వుంటారనుకున్నావా యేమిటి వాళ్లు ?

లలిత : నామూలాన వాళ్లని వదిలేస్తే పాపం వాళ్లు యాడవరు ?

దుర్గమ్మ : నాకు చాతకాదమ్మా జవాబులుచెప్పడం. మహారాజు ఆయనకేం.

లలిత : నామీద ప్రేమవుందా ఆయనకి ?

దుర్గమ్మ : ప్రేమా ? అప్పుడే ? ఓహో ? ఎంత తహతహ పడుతోంది పిల్ల ! మా చిన్నతనంలో ఎరగమమ్మా యిట్లాంటివి. ప్రేమా ? ఉండు ! రాత్రి గదిలో కావలసినంత ప్రేమ చూద్దువు గానిగా ! తినబోతూ కూర రుచి అడుగుతావెందుకు ?

[లలిత హడిలిపోయి, కుంగిపోయి వెళ్లిపోతుంది. వెనక దుర్గమ్మ మాట్లాడుతుంది.

బుగ్గలనిండా ప్రేమ, పక్కనిండా ప్రేమ, వంటినిండా ప్రేమ.

* * *

హైస్కూలులో పేపరు చూస్తున్నాడు రమణారావు, లలిత పెండ్లిఅనే సంగతి—బాధపడతాడు.]

తోటిఖైదీ : ఏమిటిబాధ రమణా !

రమణ : ఏంలేదు. చాలా స్వల్పవిషయం. లోకంలోకల్లా సుకుమారమైన పుష్పాన్నికోసి బురదలోదొర్లే పంది మెళ్లో కడుతున్నారు. చాలా స్వల్పవిషయం. యీ ఖైదులోనుంచి నేనేమీ చెయ్యలేను. [బాధపడతాడు]

* * *

[సీనయ్య గుడిసె. చెట్లపొదులు తవ్వుతున్నాడు. లలిత నుంచుని మాట్లాడుతుంది.]

లలిత : శ్రీరాముడు సత్యవంతుడు ఉత్తమపురుషుడు గనుక చూడగానే ప్రేమకలిగింది భార్యలకి. కాని నాకు——

సీనయ్య : ప్రేమ మనహృదయంలో వుంది. భర్త యెట్లాంటి వాడైతే నేం?

లలిత : ఏదో మీరు మాట్లాడితే మీ ఆత్మౌన్నత్యంలో విశ్వాసం వల్ల నమ్మాలనిపిస్తుంది. నాకేం తెలుసు. మీరు అనుభవం కలవారు.

సీనయ్య : అంతకన్నా నీమీద ప్రేమకలవారం. నీ పురోభివృద్ధిని కోరేవాళ్లం. నీమీద గంపెడాశ పెట్టుకున్నవాళ్లం. పూరికే యీ వెర్రి ఆలోచనలతో నీ మనసు కలతపరచుకోకు.

లలిత : నేను వెళ్లివస్తాను.

సీనయ్య : మంచిది.

[లలిత మోటారెక్కబోతూంది. సీనయ్య వెనక పనిచేస్తూన్న శోభనాద్రి బైటికి వచ్చాడు.]

శోభనాద్రి : [లలితతో] నన్ను మరిచిపోయినట్టున్నారు. రమణ స్నేహితుణ్ణి.

లలిత : ఓ!

శోభనాద్రి : ఈ పెళ్లికి వప్పుకోకండి.
లలిత : [అనుమానంతో] ఎందుకు ?
శోభనాద్రి : తెలిస్తే నన్ను నరికేస్తారు. వప్పుకున్నారా యావజ్జీవము బాధపడతారు.

[లలిత ధనగర్వంతో stiffen అవుతుంది]

లలిత : నా సంగతి నేను చూచుకోగలను.

[మోటారు బైలుదేరుతుంది]

శోభనాద్రి : అదిగాక రవణకి మీమీద—

[మోటారు వెళ్లిపోయింది—విధి పకాపకా నవ్వింది.

★ ★ ★

రాత్రి కొత్తపందిరి దీపాలు. చెంచురామయ్య గర్వంగా నుంచుని చూస్తున్నాడు. లలిత ఇంట్లో నుంచి నిద్రపట్టక మెల్లిగా వచ్చింది]

చెంచురామయ్య : ఏం ? ఇంకా నిద్రపోలేదు ?
లలిత : నాన్నా నా కీ పెళ్లి వద్దు.
చెంచురామయ్య : [హాస్యంగా] ఉ ! ఇంకేం వద్దు ?
లలిత : అసలు నాకు పెళ్లి వద్దు. అదిగాక నాకు యీాయనమీద ప్రేమలేదు.
చెంచురామయ్య : ప్రేమ : ప్రేమేమిటి ? అప్పుడే యేం ప్రేమ ?
లలిత : నాకేదో ఏమిటో తెలీదు. కొన్నాళ్లు ఆగండి పోనీ.
చెంచురామయ్య : ఉండి తీరా యిప్పుడా ? ఇంత డబ్బు ఖర్చు చేసి ఇదంతా నా కోసమా ? నేనా మొగుణ్ణి కట్టుకునేది ? కష్టపడి—ఇంత కట్నం యేర్పాటుచేసి, ఎందరికాళ్లో పట్టుకుని ఇంత గొప్ప సంబంధం సంపాదిస్తే - బాగుంది - బాగుంది—

[కోపం చూపుతున్నాడు. లలిత యేడుస్తుంది. చెంచురామయ్య చప్పున కరిగిపోయినాడు]

చెంచురామయ్య: [బుజ్జగిస్తూ] పెద్దవాళ్లని పమ్మల్ని నమ్మ కూడదా? పుస్తకాల్లో యీ వెర్రిప్రేమ విషయాలు చదివి బాధ పడుతున్నావు. పక్కత్తెవే నాకు. నీకు హానికలిగించే పని యేమన్నా నేను చేస్తానా? వెర్రిపిల్లా! నా మీద అంతమాత్రం విశ్వాసం లేదా? అమ్మవు కాదూ! నీకేం తెలుసు! చిన్నదానివి. నీ కోసం కాకపోతే ఇదంతా నేను కట్టుకుపోతానా! పడుకో! పో! దిగులుపడకు!

[మాట్లాడలేక లలిత మెల్లగా వెళ్లిపోతుంది

★ ★ ★

పెళ్లి సీనులు, వాయిద్యాలు—హడావిడి.

లలిత అన్ని సందేహాలు మరిచి సంతోషంగా తిరుగుతోంది. బీదలకీ, గొప్పవారికీ, భోజనాలు—మధ్య లలిత పక్కతే]

లలిత: ఎవరు చెప్తారు? నా కెట్లా తెలుస్తుంది? ప్రేమంటే ఏమిటి?

★ ★ ★

[రాత్రి పదకొండుగంటలు. మేడమీద అలంకరించిన శోభనపుగది. ముందు హాలులోమంచి తలుపు. ఎదురుగా బాల్కనీకి తలుపు.

రామారావు, స్నేహితులు గదిముందు నుంచున్నారు హాయిగా.]

రామారావు: ఇంకా రాదేంరా?

ప్రకాశం: వస్తుంది, మీనాక్షి అనుకున్నావా యేమిటి? అడగందే వచ్చి తొడమీద కూలబడేందుకు?

సోమశేఖరం: నువ్వు దాన్ని తొడమీద ఎట్లా భరిస్తావో గాని నాకు భయమేసేది తొడ విరుగుతుందని.

ప్రకాశం: పెళ్లాలు పుత్త పింగాని బొమ్మలు లాభం లేదురా! కాని యెట్లాగైనా మొదటిరాత్రి మొదటి రాత్రే ననుకో!

[లలితా దుర్గమ్మా మెట్లమీదనుంచి వస్తున్నారు. స్నేహితులు పరుగెత్తుకు పోయినారు. రామారావు గదిలోకి వెళ్లి pose పెట్టి కూర్చున్నాడు. దుర్గమ్మ లలితను గుమ్మందగ్గిర క్షేమగా వదలి తలుపువేసి వెళ్లిపోతుంది. లలిత సిగ్గుపడుతూ నుంచుంది.]

రామారావు : [మర్యాదగా] Sit down please.

[ఆమెను పరీక్షిస్తూ ఎగాదిగా చూస్తున్నాడు. ఆమె చాలాయిబ్బంది పడుతోంది. మెల్లగా కిటికీదగ్గరకు వెళ్లి బయటికి చూస్తూంది. రామారావు వెనకాలే వెళ్లి దగ్గిరగా నుంచున్నాడు. ఆమె కొంచెం దూరంగా జరిగింది.

నడుముమీద చెయివేశాడు. తీసివేసింది, మళ్లా వేశాడు. మళ్లీ తీసివేసింది. మళ్లీ వేశాడు. గట్టిగా తీసివేసి దూరంగా వెళ్లింది.

రామారావు : అదేమిటి ? ఓహో.! కొంచెం బెట్టు ఎక్కువే ?

[బుజ్జగిస్తున్నాడు, నవ్వుతున్నాడు.]

[మాటలు లేకుండా అతను బుజ్జగించబోవడం, ఆమె నెమ్మదిగా తప్పించుకోవడం, చేతులు తీసెయ్యడం.]

లలిత : వద్దు !

రామారావు : ఏమి ?

[లలిత మాట్లాడదు.]

రామారావు : ఏం సంగతి ?

[ఆమెకే తెలియదు. అతనికి విసుగుపుట్టి మోట సరసం ప్రారంభిస్తాడు. లలిత కోపంతో లేచి, విడిపించుకుని, అసహ్యించుకుని దూరంగా పోతుంది.]

రామారావు : చాలా కొత్తరకమే. మరీ అంతబెదురా ? చాల్లే - ఇకరా——[చేయిపట్టుకుని లాగుతున్నాడు.]

రామారావు : పకటిరెండు సారులు ముద్దు. అదేపనా ?

[నెమ్మదిగా వచ్చింది. పక్కమీద కూచోబెట్టి కౌగిలించుకున్నాడు. చివాలున లేచి దూరంగా పోయింది.]

రామారావు : ఏమిటిది ? మాట్లాడు.

లలిత : నాకు బాగుండదు తాకితే.

రామారావు : బాగుండదూ ? [నవ్వుతున్నాడు.] పిచ్చిపిల్లా ! యేమిటాభయం ! చూడు బాగుంటుందో లేదో ! [దగ్గరకు వస్తున్నాడు.]

లలిత :. అయితే నేను వెళ్ళిపోతాను.

రామారావు : ఎక్కడికి వెడతావు ? ఎన్నాళ్లు వెడతావు ?

[నవ్వుతున్నాడు. లలిత భయంతో ఆలోచించుకుంటుంది]

రామారావు : రా ! దీపం తగ్గించనా ? పడుకుందాం రా!

[లలిత కదల్లేదు. దీపం తగ్గించాడు. గదిచీకటవుతుంది. ఆమెను అతను పక్కదగ్గరకు బలవంతంగా లాక్కెళ్లడం కనబడుతోంది.]

★ ★ ★

[జైలులో రవణ. అతని cell లోకి వెన్నెల పడుతోంది. పేపరులో పడ్డ లలితబొమ్మ వంక చూస్తున్నాడు దిగులుగా.]

★ ★ ★

[లలిత పక్కమీదనుంచి చివాలున లేచి దీపం పెద్దది చేసింది. ఆమె జుట్టూ బట్టలూ అద్దంముందు సర్దుకుంటుంది. మంచానికి పక్కగా రామారావు నుంచుని వున్నాడు.]

రామారావు : ఏమిటీ వ్యవహారం ? నాకేం అర్థం కావడంలేదు.

[లలితకు సిగ్గుపోయింది.]

లలిత : నాకు చాలా ఎక్కువగా అర్థమైంది. నేను వెళ్లుతున్నాను.

[తలుపువేపు నడిచింది]

రామారావు : సరే వెళ్లు,

[లలిత వెళ్లబోతోంది]

రామారావు : నువ్వు నవ్వుల పాలవుతావు. వెళ్లి యేంచెపుతావూ ?

[లలిత చప్పున ఆగి ఆలోచిస్తుంది]

రామారావు: అట్లాబుద్ధి కలిగి రా! [చేయి పట్టుకున్నాడు. విదిలించుకుని, దూరంగానుంచుని యోచిస్తుంది]

రామారావు: యేమిటి? మహాబెట్టుచేస్తున్నావు. నువ్వు మహా—యేంగొప్ప—ఆడదానివి గావూ? నువ్వు లేకపోతే నాకేం జరగదనుకుంటున్నావా?

[లలిత కుంగిపోయింది]

రామారావు: యేమిటిగోల? అదేదో నోటితో యాడవ్వరాదూ? నాతో కాపరంచేయ దలుచుకున్నావా? లేదా యేమిటి చెప్పు.

[భయంకరంగా ఆవిడె మీదికి వెళ్లాడు. లలిత బాల్కనీలోకి పరుగెత్తింది]

లలిత: రావద్దు. నేను కిందికన్నా దూకుతానుగాని.

రామారావు: ఆగు! ఆగు! లోపలికిరా అక్కణ్ణించి.

లలిత: మీ రక్కడే నుంచోండి.

[రామారావు వెనక్కి వెళ్లాడు]

రామారావు: యీ రాత్రికేనా? యెప్పుడూ యిట్లా విడిగా వుండ దలుచుకున్నావా?

లలిత: [కష్టంగా] యేమో తెలీదు. నాకు మిమ్మల్నిచూస్తే యిష్టంగా లేదు.

రామారావు: యిష్టంలేదూ. ఇదేంపెళ్లి? ఇదేంరాత్రి!

[కష్టపడుతున్నాడు, లలితకు జాలివేసింది]

రామారావు: నే నేంచేశాను. నేనే మంత అసహ్యంగా ఉన్నానా?

లలిత: కాదు అట్లా తాకకండి. మాట్లాడదాం

రామారావు: తెల్లార్లూనా?

లలిత: [జాలిగా] పాడతాను.

రామారావు : వృత్తపాఠేనా ? పురాణంకూడా వినిపిస్తావా ? అయితే ఇంకేంచేయను నామీద అంతయిష్టంలేకపోతే నీకు ? వేరేపెళ్లి చేసుకుంటాను.

[లలిత చాలా సంతోషం ఆశ కనబరుస్తుంది. రామారావు disappoint అయినాడు. కోపం వచ్చింది.]

రామారావు : నేను నీకు బాగుండలేదా? నీ మొఖానికి. ఎక్కడికి పోతావు ? [కౌగిలించుకున్నాడు]

లలిత : వదలండి ! అరుస్తాను. గోలచేస్తాను. నన్నుతాకకండి !

రామారావు : [రామారావు లలితను వక్కతోపుతోసి] యేడు ! నీ కర్మం. యేమన్నా యేడు !

[మాట్లాడకుండా పడుకున్నాడు. లలిత సోఫామీది దిండు తీసుకుని, బాల్కనీలోకిపోయి, అటువేపు గోళ్లెంపెట్టుకుని పడుకుంది. అవమాన పడ్డ తన వంటివంక చూచుకుని, నిర్మలమైన చంద్రుడివంకచూచి బాధ పడుతుంది చాలా సేపు.]

* * *

[మర్నాడు సాయంత్రం. సుందరి లలితకు జడ వేస్తుంది. లలిత పరధ్యానంతో పాడుకుంటోంది నిగులుగా. ఆమెకళ్లముందు చిన్నప్పటి సీమలు తిరుగుతున్నాయి. తనవంటిమీద అభిమానం, సిగ్గు, ఎవర్ని తాకనీయకపోవడం, సుందరి వూరికే పలకరించి distrub చేస్తుంది.]

సుందరి : ఏంచేశాడు ? చెప్పవూ నాతో. గదిలోకివెళ్లి నుంచున్నావు. తర్వాత; అతను-

లలిత : అబ్బ ! ఉండూ ! [పాడుకుంటోంది]

సుందరి : ఇంక మాతో మాట్లాడతావా అమ్మా ! అప్పుడే ఎంత గర్వమే ! నీకేం అమ్మా !

[లలిత కళ్లముందు నిన్నరాత్రి అతను తనను తాకరావడము, తన అసహ్యమూ జ్ఞాపకం వస్తున్నాయి. దుర్గమ్మ వచ్చింది]

దుర్గమ్మ : మీరందరూ వకసారి బైటికివెళ్లండి !

[అందరూ వెళ్లారు]

దుర్గమ్మ : ఇదేమిటే అమ్మాయీ ! యీ గోలేమిటి ? అయ్యో వెర్రిదానా! అంతరాద్ధాంతము చేశావుట నిన్నరాత్రి. [ఆపుకోలేక నవ్వుతోంది] యేమిటి, మరీ అంత యేడిపించటమా మనిషిని?

[లలిత వూరుకుంది]

దుర్గమ్మ : మాట్లాడవేం ?

లలిత : నా కిష్టంలేదు, ఆ గదిలోకి పోవడం.

[దుర్గమ్మ మళ్లీ నవ్వుతోంది. లలిత బాధపడుతుంది]

దుర్గమ్మ : మంచిదానివే, వెళ్లక !

[లలిత మొఘంచూచి తానూ serious గా అయింది]

దుర్గమ్మ : యేమిటీ? అసలు సంగతి చెప్పు ! అతడుయేమన్నాడో తెలుసునా. దానికి సంసారం అంటే తెలియదన్నాడు. యెంత అప్రదిష్ట! యెవరన్నా వింటే నవ్వి చావరూ! [నవ్వు ఆపుకుంటూ కోపంగా] మాట్లాడవేం? ఎన్నడు వంటా యింటాలేని సంగతి.

లలిత : నన్ను చంపండి ! నాకు యిష్టము లేదు.

దుర్గమ్మ : యిదేమిటే మరీ అంత సిగ్గులేని శిఖండివైనావు ? కాపరం చేయవుటే నీవు ? ఆడదానివిగావూ ? మరి పెళ్లి అంటే యేమనుకున్నావూ ? మొగుడు తెల్లార్లూ రామాయణం పారాయణ చేస్తాడనుకున్నావా ? ఛీఛీ ! ఇదేంపుట్టింది ? ఏదన్నా గ్రహబాధ కాదుగద !

లలిత : యేమో నాకేం తెలీదు. నేనా గదిలోకి పోను.

దుర్గమ్మ : ఎవడికోసం పోతావు. ఇంకా మంచివాడు గనుక వూరుకున్నాడు. రెండుతన్ని యిష్టపెడతాడు. ఊరుకుంటారా యేం?

నీకు చేటుక్కాలం పుట్టిందే. నిక్షేపంవంటి మొగుణ్ణి తీసుకొస్తే నీకేం రోగమే. నాను తేలేవమ్మా. మీ నాన్నగారు తీర్చవలసిందే. [వెళ్లింది.]

[లలిత కిటికీలోంచి ఆకాశం చూస్తూ ఆలోచిస్తుంది. కిందనించి సంగీతం. చెంచురామయ్య అతి మూడుడుగా వచ్చాడు. లలిత యేడుస్తూ కౌగలించుకుంది.]

లలిత : నాన్నా! నీకూ నా మీద దయలేదా? నాకు పెళ్లివద్దు. పెనిమిటీవద్దు, మీతో పుణ్ణియ్యండి చాలు.

చెంచురామయ్య : యేమిటి? చచ్చిచెడి, గడ్డితిని, చక్కని మొగుణ్ణి తీసుకొస్తే—ఇంకా నా పరువు గడ్డిపరక్కి అక్కరకి వస్తుందా? యీ పదివేలూ యెందుకు పోసినట్టూ?

లలిత : మీ డబ్బుకోసం, మీ మర్యాదలకోసరి, నన్ను నాశనం చేస్తారా?

చెంచురామయ్య : నా మాట వింటావా? వినవా?

లలిత : నా చాత కాదు.

[విదిలించి అవతలికి తోశాడు.]

చెంచురామయ్య : చాతకాదా? మొగుడితో కాపరం చేయటం నాశనమా? ఇదుగో! నోరుమూసుకొని సరిగ్గా గదిలోకి నడు. అంతేకాని పుట్టింటో కొవ్వితిని కూర్చుందామని నీ యెత్తు గావును. ఆ ఆస వదలుకో! సరిగా కాపరం చేస్తే చెయ్యి! లేకపోతే నీ గతి నువ్వు చూసుకో!

[వెళ్లిపోయినాడు, సుందరి వచ్చింది.]

సుందరి : ఏమిటిది లలితా! ఇట్లాంటి పనిచేశావు?

లలిత : సుందరి! సుందరీ! నీకన్నా అర్థంకాలేదా? అట్లా చూస్తావేం నా వంక? నేనేదో హత్యచేసినట్టు.

సుందరి : నువ్వు చేసినపనికన్నా అదే నయం.
లలిత : నేను చేసినపనా! అతనిమీద నా కిష్టం రాలేదు. నేనేం బోగందాన్నా ?
సుందరి : ఎంత అప్రదిష్ట ? యింక ముందు నీ గతేమిటి ? ఎట్లా తప్పించుకోగలవు ?
లలిత : పోతాను. పారిపోతాను.
సుందరి : ఊరుకుంటారూ—లాక్కొస్తారు.
లలిత : ప్రజలు లేరా ? పోలీసులు లేరా ?
సుందరి : ప్రజలు విరగబడి నవ్వుతారు. పోలీసులు నిన్నే లాక్కుపోయి వప్పగిస్తారు.

[లలిత ఆశ్చర్యంతో నమ్మలేక చూస్తోంది.]

లలిత : సుందరీ! సుందరీ! నా వంక అట్లా చూడకు!

*　　　*　　　*

[సీనయ్య ఆశ్రమము. సీనయ్య తాంబూర మీటుకుంటూ పాడుకుంటున్నాడు. లలిత వచ్చింది.]

లలిత : తాతయ్యా! మీరందరూ కలిసి యేంచేశారు నన్ను.
సీనయ్య : [శాంతంగా] నాకు తెలుసు, అంతా విన్నాను. అతను కొంచెం తొందరపడ్డాడు. అంతకన్న యేం లేదు.
లలిత : నేనేం చేశాను. అందరూ వక్క నిముషంలో విరోధులైనారు నాకు.
సీనయ్య : లోకం వెర్రిలోకం.
లలిత : నాన్నకూడా ఇంట్లోంచి పొమ్మన్నాడు. యేమైనా కానీ నన్ను చంపినా ఆ గదిలో అడుగుపెట్టను. నువ్వు నన్నిక్కడ వుండనియ్యవా ?
సీనయ్య : ఇక్కడా ?

లలిత : వద్దులే. నా గతి నేను చూచుకుంటాను.

సీనయ్య : వుండు ! విను !

లలిత : నాగతి యింతే ? నా కెవ్వరూ తోడులేరూ ! నువ్వూ వాళ్లతో జేరిపోయినావా ? లోకంలో నా కెవ్వరూ-వక్కరూ నా వేపు పలకరూ ?

సీనయ్య : నే నెవరూ ? మే మెవరం ? అతను నీ భర్త. నిన్నటి నుంచి అతనే తల్లి, తండ్రి, దైవము. మీ రిద్దరూ వకటి. మే మెవరం ?

లలిత : నమ్మించి, బోనులోకి పంపి, తలుపు బిగించి, నవ్వు తున్నారా ?

సీనయ్య : నీ బాధ నాకు తెలుసు వోర్చుకోవాలి.

లలిత : నీకేం ? చెపుతావు. నువ్వెళ్లు తెలుస్తుంది.

సీనయ్య : భర్తని వదలమని యెట్లా చెప్పనూ. వచ్చే కష్టాలు నీకు తెలీవు.

లలిత : యే కష్టాలు రానీ ! నేనేమైనా కానీ, ప్రాణత్యాగమేకానీ, నేను నా శరీరాన్ని, నా నిర్మలత్వాన్ని ఆ వ్యభిచారానికి అంగీక రింపచెయ్యను. [వెళ్లుతోంది.]

సీనయ్య : వుండు ! వుండు ! నీ ధర్మానికి నువ్వు తిరగబడడము అవివేకం, హిందూధర్మం——

లలిత : యేం ధర్మం ? యే మతమది ? ఇష్టంలేనివాడికి నా దేహాన్ని వప్పచెప్పే మతం, నన్ను బోగందానికన్నా హీను రాలిని చేసే ధర్మం, నా స్త్రీత్వాన్ని శీలాన్నీ, మలినం చేసుకో మనే శాస్త్రం నేను వప్పుకోను. నేను తిరగబడతాను. శపిం చండి ! దండించండి ! ఆడదాన్ని, దిక్కులేనిదాన్ని, ధనమూ,

శక్తి, లేని అనాథని, నాశనం చెయ్యండి అందరూ కలిసి. వీధు లంబడి అడుక్కుతిని చస్తానుకాని, యీ అసహ్యానికి, రోతకీ వప్పుకోను. వీధులో ఏ దుర్మార్గుడికో శరీరం స్వేచ్ఛగా అమ్ము కోడం వెయ్యిరెట్లు నయం యీ వివాహంకన్న. [వెళ్లుతూంది.]

సీనయ్య : ఆగు ! ఆగు ! [ఆలోచిస్తున్నాడు] నేను అతనితో మాట్లాడుతాను. తర్వాత యోచిద్దాము పద నేనూ వస్తాను. [ఇద్దరూ మోటారెక్కుతున్నారు.]

* *

సీనయ్య : [కోపంగా] గొడ్లుకూడా అట్లా సంచరించవు. ఎదటి వారి యిష్టం కనిపెట్టకుండా, మా లలిత హృదయాన్ని ఆకర్షిం చగల ఔన్నత్యం, అదృష్టం లేనివాడివి.

రామారావు : నోరుముయ్ ! బైరాగివాడు నీతులు చెప్పవచ్చాడు నా భార్యసంగతి నేను చూచుకోగలను బైటికి నడు.

సీనయ్య : నీ భార్య నీకు దక్కదు జాగ్రత్త !

రామారావు : ఏం చేస్తుంది ?

సీనయ్య : చస్తుంది. నా ఆశ్రమంలో దాచుకుంటాను, నా బిడ్డని యేం చేస్తావు ?

రామారావు : దాచుకో ! లక్షలు ఆడపిల్లలు.

[సీనయ్య బాధతో కుంగి ఆలోచిస్తున్నాడు.]

సీనయ్య : అవును. యీ పుణ్యభూమిలో భార్యలు అతిచౌక, కాని యీ దరిద్ర దేశంలో, ఆస్తులు చాలా కరువు. మరి చెంచు రామయ్యగారి ఆస్తీ తమకెట్లా దక్కుతుంది, లలితను వదులు కుంటే ? [వెళ్లుతున్నాడు.]

రామారావు : వుండండి ! నేను చేసిన తప్పేమిటి ? నా కోర్కెలో అధర్మంవుందా ? పైగా ఆ సిగ్గులేనిదాన్ని వెనకేసుకొస్తున్నారు.

సీనయ్య : లలిత అమూల్యమైనవరం నీకు. ఆమె ప్రేమనే సంపాదించగలిగావా, అంతకన్న నీకు స్వర్గం యేం గావాలి ? నే నడిగేది యేమీలేదు, తొందరపడకు. ఆమెకి నీ మీద ప్రేమ కలగడానికి వ్యవధి నియ్యి ! యేం ?

[రామారావు సరేనని తలవూపుతున్నాడు]

రామారావు : యేం చేయమంటారు నన్ను ? మరి భార్య ఐనాక——

సీనయ్య : అదంతా నాకు తెలుసు. లలితను నేను వప్పిస్తాను మీతో వచ్చేట్టు. కాని ఆమె యిష్టపడందే మీరు మాత్రం——

[రామారావు కష్టంగా సరేనంటాడు.]

సీనయ్య : వాగ్దత్తమేనా ?

రామారావు : నిజం.

సీనయ్య, లలిత.

సీనయ్య : వప్పించాను. నువ్వుమాత్రం నీ మనఃపూర్వకంగా ప్రయత్నించాలి, అతన్ని ప్రేమించేందుకు.

లలిత : ఎట్లా ప్రేమించనూ ?

సీనయ్య : ఈశ్వరాంశలేని మానవుడు లేడు. వెతికి అతని ఔన్నత్యాన్ని ప్రోత్సహించి, నీ ప్రేమకి అర్హుణ్ణిగా చేసుకోలేక పోతివా, దౌర్భాగ్యురాలివౌతావు. ఈ లోపల నిన్ను బలవంతం చేయకుండా, నేను వప్పిస్తాను.

* * *

[రాత్రి లలిత, రామారావుగదిలో. రామారావు మంచంమీద పడుకున్నాడు. లలిత బాల్కనీలోకి వెళ్లి తలుపు బిగించుకుని సోఫామీద పడుకుని నిద్రపోయింది. రామారావు లేచి కిటికీలోంచి ఆమె అందము చూసి కోపంతో దిండ్లూ అవి విసిరివేసి కోపం తీర్చుకుంటున్నాడు.]

* * *

[కాలం గడిచింది. కాంగ్రెసుకి ప్రభుత్వానికీ రాజీ కుదిరింది. ఖైదీ

లందర్ని వదులుతున్నారని న్యూస్ పేపర్ల కేకలు. రాజమండ్రీ జైలుదగ్గర నుంచి రమణారావుని ఊళ్లో ఊరేగింపు.]

[అతను యింటిదగ్గిర దిగడం, వెంటనే తల్లి కౌగలించుకుంది. అతను తొందరగా గదిలోకి వెళ్లి లలితపటంవంక చూస్తున్నాడు. తల్లి వెనకగా వచ్చింది.]

రమణ: లలితకు పెళ్లిఅయింది కదూ!

తల్లి: చాలారోజులైంది. మద్రాసులో వుంది.

రమణ: రామారావుకి—వాడు—ఆ రామారావుకి. ఎంత వికృతాలు జరుగుతాయి యీ లోకంలో.

తల్లి: ఏదో పెళ్లిరాత్రి గొడవ జరిగిందనికూడా చెప్పుకున్నారు. కాని అందరూ చెప్పి బలవంతంచేసి పంపారట—స్నానం చేద్దుగాని రా! [వెళ్లింది]

[రమణారావు ఫోటోవంక అట్లానే చూస్తున్నాడు. చిన్నప్పటి సీనులు కళ్లముందు కనబడుతున్నవి.]

[చిన్నపిల్లలు, తాను, లలితా. చెట్లక్రింద గడ్డిమీద పడుకుని, ఆకాశమువంక చూస్తున్నాడు. కాలవమీద తాటిబొందుమీద ఆమె చేతిని పట్టుకుని నడిపిస్తున్నాడు. పిల్లలతో దాగుడుమూతలాడుతూ, ఆమెను వంటరిగా పట్టుకొని ముద్దుపెట్టుకుంటున్నాడు. చెట్లచివరికొమ్మలకి యెక్కి బాదంపళ్లు కోసి ఆమె వడినింపుతున్నాడు. అట్ల తద్దికి ఆడపిల్లలంతా ఆడుకుంటుంటే పక్క నుంచుని చూస్తున్నాడు. బైట వసరాపిల్లలు పాటలుపాడుకుంటూ పోతున్నారు.]

[రమణకి లలితా తానూ బళ్లోకి విల్లంబులు పట్టుకుని వెళ్లడం, ఆమెను చేయి పట్టుకుని బురదనుంచి తప్పించి తాను నడిపించడం కనబడుతున్నాయి. సీతాయమ్మ వచ్చి కూర్చున్నది.]

సీతాయమ్మ: అబ్బాయీ! మొన్న పాపయ్యగారు వచ్చార్రా; ఆయన పిల్లనిస్తామని. రెండువేలు కట్నమిస్తారట.

రమణారావు: పెళ్లి సంగతి యెత్తకు అమ్మా!

సీతాయమ్మ : అదేమిట్రా అట్లా అంటావు ?

[రమణ గదిలోంచి వెళ్ళిపోయినాడు.]

★ ★ ★

[మద్రాసులో రామారావు మేడ. పూజగది. ఉదయం లలిత పూజ చేస్తుంది. దేవిపటం ప్రక్కన భర్తపటం. పూజనుండి లేచి పెద్దపూల దండ తీసుకుని ముందు గదిలోకి వెళ్ళింది. అక్కడ రామారావు ఫోటో enlargement కు దండవేసి నమస్కరించింది. ఆ ఫోటోకేసి చూస్తూ భర్తమీద భక్తిని తెచ్చుకోవాలని ప్రయత్నిస్తుంది. రామారావు వచ్చాడు.]

రామారావు : నేను వుండగా ఆ పటానికి యెందుకే అలంకారం ?

[ఆమె అతని పాదాలకి నమస్కారం చేసింది.]

రామారావు : ఎంత అందంగావుంది నీ విట్లా నమస్కరించడం. ఆ తీప జన్మతో రావాలిగాని, ఆ ముండలికి వక్కదానికీ చాతకాదు ఆ వడువు. [బుజ్జగిస్తున్నాడు. కష్టంతో వోర్చుకుంటుంది. కళ్ల ముందు దేవిని నిలుపుకొని వప్పుకుంటుంది.]

రామారావు : అట్లా వప్పుకో ! మంచిపిల్ల వి.

[పూజామందిరంలో దేవీ బొమ్మ నవ్వుతుంది. గడియారం మధ్యాహ్నానికి తిరిగింది. లలిత భర్తబట్టలను స్వయంగాచాకలికి వేస్తుంది. అప్పుడప్పుడు జేబులవాసనకి అసహ్యపడుతోంది. కోటుజేబులోంచి కాగితం కిందికి పడ్డది. అది యెవత్తెదో ఫోటో. పక్కపిల్ల అల్లరి.]

వంటమనిషి ఫలహారము తీసుకొచ్చాడు Tray లో భర్తకీ, మిత్రులకీ ఫలహారాలు, టీ, అరెంజిచేసి పంపుతూంది.]

లలిత : ఇది ప్రత్యేకం అయ్యగారికి.

[బైటగదిలో రామారావు స్నేహితులు పేకాడుతున్నారు. వంటమనిషి ఫలహారాలు తీసుకొచ్చాడు.]

వంటవాడు : ఇది తమరికని చెప్పమన్నారు అమ్మగారు.

[రామారావు చిరునవ్వుతో బడాయిగా మిత్రులతో కన్ను గీటుతున్నాడు.]

★ ★ ★

[సాయంత్రం అయింది. రామారావు తోచకుండా కూర్చున్నాడు. రేడియో పాడుతుంది. కామయ్య వచ్చాడు.]

రామారావు : ఏం ?

కామయ్య : దొరకలేదు.

రామారావు : దొరకలేదంటే యెట్లా ? వెళ్లు. యీ సాయంత్రమే వూరికివెళ్లి రైతులదగ్గర్నించి ఎట్లానన్నా పోగుచేయి. వేలాలు అమలుజరిపించి, వారంరోజుల్లో నాలుగువేలన్నా దొరికితేనే గాని యీ వారంటు ఆగదు.

కామయ్య : చిత్తం ప్రయత్నిస్తాను. కాలం యిదివరకు మల్లె కాదండి. యీ కాంగ్రెసువాళ్ల దుర్బోధనతో ప్రతివారికీ నిర్లక్ష్యం యెక్కువైంది. [వెళ్లుతున్నాడు.]

[లలిత నెమ్మదిగా వచ్చింది]

లలిత : ఎవరూ రాలేదా ? వక్కరూ కూర్చున్నారు.

రామారావు : ఎక్కడచచ్చారో....అబ్బ ! గోల ! [రేడియో ఆపాడు]

లలిత : పోనీ, నేను పాడనా ?

రామారావు : కానీ.

[లలిత కృతులు పాడుతుంది, పియానోమీద వాయిస్తూ]

రామారావు : మీ నాన్నకు వ్రాసి ఆరువేలు అప్పు యిప్పించలేవూ ?

[లలిత జవాబు చెప్పకుండా పాడుతుంది]

రామారావు : ఏమి నే నడిగిన సంగతి ?

లలిత : మొన్ననేగా రెండువేలు పంపారు. ఇక వ్రాయవద్దన్నారు.

[రామారావు ఆవలిస్తున్నాడు. లలిత ఆపింది]

రామారావు : చాల్లే ! క్లబ్బుకి పోతాను.

[కోటు వేసుకుని మోటారులో వెళ్ళుతున్నాడు. లలిత వంటరిగా చీకట్లో నుంచుని చూస్తూవుంది. కుక్కపిల్ల ఆమెను పలకరిస్తోంది.]

★ ★ ★

[రాత్రి గదిలో పక్క అమర్చి లలిత బైటికి వెళ్ళబోతోంది. రామారావు వచ్చాడు. ఆమెనుచూసి సంతోషపడ్డాడు.]

లలిత : అప్పుడే వచ్చారేం ?

రామారావు : ఇక్కడేం చేస్తున్నావు ? పిచ్చిపిల్లా ! నువ్వా యివన్నీ యింత శుభ్రంగా అమిర్చేది ? ప్రతిరాత్రి ? వెంకయ్యకి యింతతెలివి యెట్లా వచ్చిందా అనుకుంటున్నాను. గది యింత అందంగా చేసేదానివి ఉండిపోతేమాత్రం యే ?

[ఆమెను కౌగిలించుకుంటాడు వోర్చుకుంటుంది. ఇంకా చనువు తీసుకుంటూవుంటే భరించలేక మెల్లిగా వదిలించుకుని వెళ్ళిపోతోంది.]

రామారావు : ఇంకా యెన్నాళ్ళు ?

లలిత : అదే నా ప్రయత్నంకూడా. నాకు సహాయపడండి ?

రామారావు : ఎందుకు ?

లలిత : మిమ్మల్ని ప్రేమించేందుకు.

[వెళ్ళిపోయింది. అతను చిరాకుతో పెదవి కొరుక్కుంటున్నాడు. ఆమె బైటికి వెళ్ళి వరాండాలో చంద్రుని వంక చూస్తూ విధిని ప్రశ్నలడుగుతూంటుంది. రామారావు గదికిటికీనుంచి ఆమె అందాన్ని చూచి బాధ పడుతున్నాడు.]

★ ★ ★

[వీధిలో బిచ్చపు పిల్ల పాడుతూ వెళ్ళుతోంది. లలిత కబురంపి పిలిపించింది. పాటలు పాడించుకుంటుంది మధ్యలో.]

లక్ష్మి : [రహస్యంగా] అమ్మా ! అయ్యగారి గదిముందు కెళ్ళండి ఒకసారి.

లలిత : ఏమి ?

లక్ష్మి : వెళ్లండి ! చెపుతా !

[లలిత ఆలోచించకుండా పరధ్యానంగా వెళ్లి తలుపుతీసింది. లోపల రామారావు సరస్వతితో సరసాలాడుతున్నాడు. లలిత తెల్లబోయి చూస్తుంది. సరస్వతి పారిపోయింది. లలితకు కోపము, అసహ్యామూ వచ్చాయి. రామారావు యిక్కిలిస్తున్నాడు.]

రామారావు : యేదో - పొద్దుపోక——

[మళ్లీ తన dignityని తెచ్చుకున్నాడు.]

రామారావు : మరి భార్యలు భర్తల్ని వుపేక్షచేస్తే——

లలిత : భర్తలు భార్యల్ని వుపేక్ష చేసినప్పుడు యిట్లాంటి పనులే చేస్తే——

రామారావు : అప్పటి సంగతి అప్పుడు.

లలిత : దాన్ని పంపెయ్యండి !

రామారావు : పంపితే-నువ్వు- [చెంపను తాకాడు.] నువ్వుంటే నాకు వాళ్లెందుకూ ?

[లలిత తన చెంపను తుడుచుకుంటూ అతన్ని వక్క తోపుతోసింది.]

లలిత : ఛీ ఛీ ! నన్ను తాకవద్దు.

రామారావు : అమ్మ పెట్టనూ పెట్టదు. అడుక్కు తిన్నియ్యనూ తిన్నియ్యదు.

లలిత : వెళ్లితీరాలి.

రామారావు : నీదేమధికారం ? నువ్వు నా కొక భార్యవికూడాను.

[వెళ్లిపోయినాడు. లలిత బైట బీదపిల్లని చూసింది.]

లలిత : పాపము. ఇంకా నుంచునే వున్నావా ? పిచ్చిపిల్లా !

[వెళ్లి చెంపలు తాకుతుంది, డబ్బు యిచ్చింది.]

బీదపిల్ల : ఇంత డబ్బు నా కెందుకమ్మగారూ ?

లలిత : నీకు పెళ్లయిందా ?

బీదపిల్ల : ఊఁ.

లలిత : నీ పెనిమిటి నిన్ను ప్రేమగా చూస్తాడా ?

బీదపిల్ల : నే నెప్పుడు వస్తానా అని వీధికేసిచూస్తూ కూర్చుంటాడు. వెళతానమ్మా !

లలిత : ఇంక వేరే పిల్లలకేసి చూడడా !

[బీదపిల్ల లేనినవ్వు తెచ్చుకుంటుంది సిగ్గుతో.]

బీదపిల్ల : నేనున్నానుగా.

లలిత : రేపు రా మళ్లీ.

[సీనయ్య వచ్చాడు.]

లలిత : వచ్చావా ! తాతయ్యా ! వచ్చావా !

సీనయ్య : నీ వట్లా వ్రాస్తే, రాకుండా నా ప్రాణం నిలుస్తుందా ?

[ఆయనకోసం పళ్లు తెప్పించింది.]

లలిత : కూచో ! ఏమిటి సంగతులు ? ఇంకా వూళ్లంబటి పాటలు పాడుకుంటూ తిరుగుతున్నారా ?

సీనయ్య : కాంగ్రెసువాళ్ళతో చేరాను.

లలిత : నువ్వా ?

సీనయ్య : రవణ జైలునుంచివచ్చి తనతో కలుపుకున్నాడు. అతని దేశభక్తి నా దైవభక్తి జోడించి ప్రచారం సాగించాము. సరేలే ! ఇక్కడ సంగతులెట్లా వున్నాయి.

లలిత : లాభంలేదు. నా చాతకాదింక. నాకు మీ రెవ్వరూ సహాయం చెయ్యనక్కర్లేదు. ఏదో నా స్వంతంగా బ్రతికేందుకు—

సీనయ్య : వెర్రిదానా ! వృత్తులన్నీ ఈ భర్తకి యేది నిరాకరించావో దాన్ని కోరే నీచులైన పురుషుల అధీనంలో ఉన్నాయి. వంటరిగా బ్రతికే స్త్రీకి కలిగే కష్టాలు నీ కెట్లా తెలుస్తాయి? అందుకనే జ్ఞానం గలవాళ్లం, ఎంత బాధగా వున్నా స్త్రీకి సంసారమే వుత్తమమని వాగుతాము ఇట్లా.

లలిత : కాని నేనెంత నీచమైపోతున్నానో, నన్ను చూస్తే నాకే పరమ అసహ్యంగా వుంది. ఇది చెప్పడానికా నువ్వు—

సీనయ్య : ముసలివాణ్ణి. నా మీద ఆగ్రహించకు.

[లలిత యేడుస్తుంది.]

సీనయ్య : ఎప్పుడూ కష్టాలు వక్కవిధంగా నిలవ్వు. ఆనందం కావాలని పోట్లాడ్డానికి యెవరికి హక్కువుంది. ఎంత చేశావో అంత అనుభవించితీరాలి. పరుగెత్తితే మాత్రం ప్రారబ్ధం తప్పుతుందా ?

[పాడుతున్నాడు. అతని వళ్లో పడుకుని యేడుస్తో నిద్రపోయింది.]

సీనయ్య : పిచ్చిపిల్ల. ఎందుకో ఈశ్వరుడు యీ సుకుమారిని, యీ పద్మాన్ని యిట్లా రాళ్లమధ్య చితకగొట్టడం? ఉద్దేశమేమో !

[పల్లెటూరు.]

[రమణా, సీనయ్యా, శోభనాద్రీ, పల్లెటూరు పారిశుధ్యంకోసం ప్రచారంచేస్తున్నారు. వీథులువూడ్చి చూపుతారు. ఇళ్లు బాగుచేస్తారు. బూజులు దులుపుతారు.]

[ఒకయింట్లో గోల. కామయ్యా, మునసబూ, ఆ ఇంటివాళ్ల చెంబులూ, గేదెలూ, నాగలీ వేలానికి తీసుకుపోతున్నారు. సీనయ్య మొదలైనవాళ్లు అడ్డపడ్డారు.]

కామయ్య : మీకెందుకయ్యా, అక్కర్లేని జోక్యం ?

శోభనాద్రి : ఇట్లాంటి అక్రమాలు ఆపడమే మా ఉద్యోగం.

మునసబు : మరి యీ వూరిమీద అయిదువందలు పోగుకావాలి.

రమణ : నువ్వు రైతువికాదూ ! నీ సోదరుడి నాగల్ని వేలం వేయిస్తావా.

[ప్రజలు పోగైనారు]

రమణ : ఎవరూ ఒక్కరూ ఒక దమ్మిడీ యివ్వకండి. ఈ వొస్తువులువేలంవేస్తే యెవరూ కొనకండి. ఈ దౌర్జన్యం యీ

నాటితో అంతమయ్యేట్టు చేద్దాం అందరమూ కలిసి.

★ ★ ★

[లలిత గదిలో కుక్కతో ఆడుకుంటూంది. సుందరి వొచ్చింది. తటాలున లలిత లేచి సుందరిని కౌగిలించుకుంది.]

సుందరి : ఎన్నాళ్లయింది?

లలిత : ఎట్లా వొచ్చావు?

సుందరి : నిన్ను surprise చేద్దామని నీకు వ్రాయలేదు. ట్రిప్లికేను స్కూల్లో కుట్టుటీచరుపని సంపాయించాను.

లలిత : [సంతోషంతో] ఇంక యీ వూళ్లోనే వుంటావా?

[రామారావు అటువెడుతో కొత్తకంఠం విని తలుపులోంచి తొంగి చూశాడు. ఎవరో ఆడవాళ్లున్నారని వెళ్లిపోతున్నాడు.]

లలిత : ఇదేమిటి? సుందరి నెరుగరూ?

రామారావు : అవునవును....

[సుందరిని admiration తో చూస్తున్నాడు.]

[ఇకముందంతా లలిత తనకీ తనభర్తకీ all is well అని సుందరి ముందు నటిస్తుంది.]

సుందరి : [helpless గా] నేనువెళ్లి lodgings కుదుర్చుకోవాలి. వూరుచూస్తే భయంగావుంది. ఎవర్నీ యెరగను. ఆడదాన్ని—

రామారావు : అసలు....[ఆగాడు]

లలిత : అవును. నువ్వు వేరే వుండడమెందుకు? మీస్కూలు దూరమా?

రామారావు : కారు వుందిగా!

లలిత : అవును ఇక్కడేవుండు. సుందరీ.

సుందరి : [రామారావువొంక చూస్తో] మరి మీకు భారం కాకపోతే-

లలిత : ఆయనకి insult గొప్ప జమీందారుగారేమిటి—

★ ★ ★

[వారం తరువాత.]

[సాయంత్రం-మోటారుముందు సుందరీ, రామారావూ నుంచున్నారు.]

సుందరి : లలిత లేకండా నేను బైటికిరాను. లలితని వొదిలి, పాపం,—

రామారావు : నిజం చెప్పరాదూ, నీ reputation కి భంగమని—

సుందరి : అదికూడా అనుకోండి. ముఖ్యంగా మీ వంటి reputation వున్నవారితో— [లలిత వొచ్చింది] కదిలిందయ్యా చివరకి ! ఇన్నాళ్లు Madras లో వుందిట ! సినిమాచూడలేదట. shameful! ఈ భర్తల్ని అట్లా కళ్లాలు బిగించి సేవచేయించుకోవాలి గాని, పాతముత్తయిదులవలె వొదిలామా—ఇంక మనవారు కారు.

లలిత : వెడదాం పద !

[రామారావు సుందరి వేషానికీ లలిత dress కీ భేధం చూస్తున్నాడు.

రామారావు : సుందరీ, లలితకి dress చేసుకోడం నేర్పరాదూ?

సుందరి : చెప్పాను, కాని వినటంలేదు.

లలిత : ఏం? మీభార్య అని చెప్పుకోడం నామోషీగా వుందా !

రామారావు : కాదుమరీ position కి తగినట్టు dress వుండకపోతే!

[మోటారులో వెడుతున్నారు.]

[flower show లో ముగ్గురూ తిరుగుతున్నారు.]

[లలిత పువ్వుల్నిచూసి తన్మయురా లౌతుంది. వాళ్లిద్దరూ పువ్వుల కన్న మనుష్యుల్ని ఎక్కువగా చూస్తున్నారు.]

[సుందరి రామారావు ముందుగా వెళ్ళారు. లలిత అట్లా పరధ్యానంగా వుండిపోయింది. దూరాన రమణ స్నేహితులతో వెడుతో లలితని చూశాడు. అట్లా చూస్తో నుంచుని వుండిపోయినాడు. ఆమెని పలకరిద్దామా, లేదా అని సందేహిస్తాడు. చివరికి వద్దనుకుని వెళ్లిపోతాడు.]

[సుందరి రమణని చూస్తుంది.]

సుందరి : [రామారావుతో] అతనే అతనే. మొన్నరమణ ఎవరని

అడిగారే అతనే. [రామారావు చూస్తున్నాడు.]

రామారావు : అతనే! మా రైతుల్ని పన్ను లియ్యకుండా దుర్బోధనలు చేస్తున్నాట్ట. ఒక దమ్మిడీరాలేదు. కటకట పడుతున్నాము.

సుందరి : పిలవనా?

రామారావు : ఎందుకులే! సుందరీ! నువ్వీతన్ని బాగా ఎరుగుదువుగా—ఒక్క సహాయం చేసి పెట్టరాదూ?

సుందరి : నా కన్న అతనికే లలితస్నేహం యెక్కువ.

రామారావు : లలిత యెందుకులే! నువ్వే చేసిపెట్టు. ఏ విధంగా నన్నా అతను ఆ దుష్ప్రయత్నం మానుకోవాలి—

సుందరి : **అయితే పిలుస్తాను. రమణా, రమణా!**

[రమణారావు తలెత్తిచూసి విధిలేక వొస్తున్నాడు]

సుందరి : పాత స్నేహితుల్ని మరిచిపోయినారా?

రమణ : చూడలేదు.

సుందరి : వీరే రామారావుగారు, లలిత భర్త.

రమణ : ఓ, నమస్కారం.

సుందరి : రమణని చూడలేదా నువ్వు లలితా!

[లలిత అతన్నిచూసి చాలా సంతోషం కనబరుస్తోంది.]

లలిత : ఎట్లా వొచ్చావు యిక్కడికి?

రమణ : provincial congress meeting.

లలిత : ఓ! ఇంకా ఆ రాట్నాలూ అవీ మానవేవన్నమాట నువ్వు! ఈయనే నా భర్తగారు!

రమణ : తెలుసుకున్నాను. మరి—వెడతాను

సుందరి : అదేమిటి? అప్పుడే వెళ్లడం? మా యింటికి రావాలి. మేమందరమూ కలిసే వున్నాము.

రామారావు : తప్పకుండా రావాలి. [card యిస్తున్నాడు.]

రమణ : టైమ్ వుంటే !

లలిత : అదేమిటి రమణా ! అట్లా అంటావు ? నిన్ను చూస్తే నాప్రాణం లేచివొచ్చినట్టుంది. promise. వొస్తానను.

[రమణ సందేహిస్తున్నాడు.]

లలిత : నాకోసం రావూ ? నిన్నుచూస్తే—నావాళ్ళందర్నీ చూసినట్టుంది

రమణ : వొస్తాను. అందరికీ నమస్కారము.

[వెళ్ళిపోయినాడు.]

[దూరంగా వెళ్లి లలితవంకే చూస్తున్నాడు.]

★ ★ ★

[లలిత దేవీపూజచేసి బ్రాహ్మణ సంతర్పణ చేస్తోంది. సుందరీ, రామారావు నవ్వుకుంటున్నారు. రమణ వొచ్చాడు ముందుగదిలోకి—]

రామారావు : రండి, కూచోండి. కాఫీ, సిగరెట్లు.

రమణ : Thanks, వొద్దు.

రామారావు : Anything stronger ?

సుందరి : రవణ puritan, స్వదేశీ—

రామారావు : స్వదేశి రకాలుకూడా దొరుకుతాయి. కొంచెందూరం-[నవ్వుతున్నాడు]

రమణ : లలిత యేదీ.

సుందరి : లలితా ! మనకి కనపడుతుందా ? ఆమె పూజలు బ్రాహ్మణ సత్కారాలూ—

రమణ : ఈ కాలంలో కూడానా ? ఆ nonsense ఎట్లాపట్టుకుంది ?

రామారావు : euxcuse me. [వెడుతున్నాడు.]

సుందరి : రవణా, నువ్వు వెళ్ళిపోయింతరవాత ఎన్నాళ్లు ప్రయత్నించినా మరపుకిరాలేదు నువ్వు—

[రమణారావు ఆమె drive చూడతలుచుకోలేదు.]

రమణ: ఈ చీనాసిల్కులుమాని ఖద్దరు కట్టరాదూ నువ్వు ?

సుందరి: కడితే నువ్వు—

రమణ: దేశదరిద్రులకి సహాయము చేసినదాని వౌతావు.

సుందరి: సరే కాని, రమణా నువ్వు రామారావు peasants కి దుర్బోధలు చేసి—

రమణ: మరి లలితరాదా ? రాకపోతే—

[లలిత వొచ్చింది]

సుందరి: వెయ్యేళ్లాయిస్సు.

రమణ: [సుందరితో] పోనీ, కొంచెం కాఫీ తాగుతాను తయారు చేయిస్తారా?

సుందరి: order యిస్తాను.

రమణ: నీచేత్తో తయారుచెయ్యాలి మరి.

[అర్థంచేసుకుని నవ్వుతో వెళ్లింది]

లలిత: ఎన్నాళ్లకి చూశాను. జైలునించి రాగానే నన్నుచూడ్డానికి రాలేదుకదూ.

రమణ: ఏమో అంతగా నన్నుచూడాలని నీకు వుంటుందనుకోలేదు.

లలిత: అంత చెడ్డదాన్ననుకున్నావు. ఏం ?

రమణ: పని !

లలిత: ఏమిటో ఆ పని ! రమణా నీకు ఉద్యోగమూ, పెళ్లీ యేవీ అక్కర్లేదా యేమిటి ?

రమణ: [నవ్వుతో] అట్లాగే వుంది.

లలిత: నిన్నుచూస్తే నాకేమనిపిస్తోందంటే నువ్వు ఎవ్వరినో చాలా ప్రేమించి disappoint అయినట్టు కనపడుతున్నావు.

[అతను emotion లో struggle అవుతున్నాడు]

లలిత : పాపం, నిజం. అవునా, రవణా, నిన్ను అంత క్రూరంగా గాయంచేసిన కఠినాత్ములెవరో! నీవంటివాణ్ని తృప్తి పరచడానికి ఏత్యాగానికైనా సంకోచించడం అన్యాయమనిపిస్తుంది.

[రవణ బాధపడతాడు]

రవణ : నువ్వూ సంతోషంగా లేవు. ఇంత ఐశ్వర్యంలోనూ ఎదో అసంతృప్తి, లోపలిబాధ కనపడుతున్నాయి.

లలిత : [కన్నీళ్లు ఆపుకుంటో] ఏమీలేదు.

రమణ : ఐశ్వర్యభారమే బాధ అనుకుంటాను. [నవ్వుతున్నాడు.] నేను వెడతాను.

లలిత : కాఫీ !

రమణ : ఉత్తది. అక్కర్లేదు. చూడు ఆ సుందర్ని, ఆ దెయ్యాన్ని ఇంటో చేరనిచ్చావేమిటి ? ఇంక నీకు సంసారంలో శాంతి వుంటుందా ?

లలిత : అసలు ఒకప్పుడు [తెప్పరిల్లి] నా కాభయం లేదులే. [అంది గర్వంగా]

రమణ : నాకు సందేహమే. కళ్లు చాలాగట్టిగా మూసుకున్నావేమో! జాగ్రత్త [వెడుతున్నాడు] ఈ చీకటిదేశంలో అక్కడక్కడ నీవంటి నక్షత్రాలున్నాయి. కాని వాటి ఐశ్వర్యమూ, మర్యాదా, ఇట్లాంటి మబ్బులవెనక అణిగిపోయినాయి.

[వెళ్లిపోయినాడు]

* * *

[వాలంటీర్ల camp. పెద్దచెట్టుకింద పందిరి. వంటలు చేస్తున్నారు. ఒక అతను మంగుబుడ్లు తయారుచేసి, రోగులకి చూపుతున్నాడు. ఒక మూల కొందరికి ఒక అతను news paper వార్తలు చెపుతున్నాడు. దేశ నాయకుల పటాలు చూపుతున్నాడు. సీనయ్య ఒకమూల భక్తికీర్తనలు

పాడుతున్నాడు. పిల్లలూ తనూకలిసి భజనచేస్తారు. రవణ రైలు దిగి నడిచివొచ్చాడు.]

[అందరూ captain కీ జయ్! అంటున్నారు.]

వాలంటీర్ : కాన్ఫరెన్సు విశేషాలేమిటి?

రమణ : పేపరు చదవలేదా?

వాలంటీర్ : office acceptance settle అయినట్టేనా!

రమణ : ఊఁ.

వాలంటీర్ : ఇంకేం? రవణా నువ్వు మినిస్టరువి కాబోతున్నావు.

రమణ : నోరుముయ్యి.

సీనయ్య : వొచ్చావా, నాయనా, నువ్వు కనపడకపోతే అన్నమే సయించలేదోయి. [రవణని కావిలించుకున్నాడు.]

రమణ : మద్రాసులో మన జమీందారుగారు కనపడ్డారు.

శోభనాద్రి : కనపడి—

రమణ : లోపల మండిపోతున్నారు. [సీనయ్యతో] లలితకూడ కనపడ్డది. ఏమిటి ఆమె దిగులు!

సీనయ్య : దిగులేమి వుంది?

రమణ : ఆభర్తే పెద్ద దిగులనుకుంటాను ఆ రామారావు—

సీనయ్య : నీకళ్లకి వికృతంగా ఉన్నంతమాత్రాన, పతివ్రతైన భార్యనే—

రమణ : ఇట్లా వాస్తవాన్ని కప్పి అంధుల్ని చేస్తున్నాయి గనకనే, యీపతిభక్తీ, దైవభక్తీ, యీ తుప్పులన్నీ వొదిలి పోవాలంటాను.

సీనయ్య : ఎక్కడికిపోతాయి? నీనించి నువ్వెట్లా తప్పించుకుంటావు? దైవం వేరుకాదయ్యా నీనించి—

శోభనాద్రి : మళ్ళీ ప్రారంభించారు వాదన! రవణా స్నానం చేసిరా!

[రవణ వెడుతున్నాడు.]

రమణ : ఇట్లాంటి దుర్బోధనలు చేసి, మతమని, కర్మఅని, నిర్వీర్యుల్ని చేసిపెట్టారు ప్రజల్ని! [వెళ్ళాడు]

[భోజనాలు వొడ్డించారు.]

శోభనాద్రి : రవణరాడేం? మీరే బెదరకొట్టారు అతన్ని యీశ్వరుడి పేరుచెప్పి.

సీనయ్య : పిచ్చివాడు. రవణని చూస్తే శ్రీ శంకరుడి అవతారమనిపిస్తుంది నాకు. స్త్రీ వ్యామోహంలో పడనివాడు అతనువొక్కడే.

[రమణ నదివొడ్డున లలిత photo చూస్తో ప్రపంచాన్ని మరిచాడు.]

ఏ ధర్మంలోనూ విశ్వాసం లేదంటాడా? అన్ని ధర్మాలూ అప్రయత్నంగా పాలిస్తాడు జీవితంలో. కూచోండి మీరు. తీసుకొస్తా నతన్ని.

[వెళ్ళి రమణనీ ఫొటోనీ చూసి సీనయ్య నివ్వెరపోయినాడు. దూరంగా వెళ్లి రమణని పిలుస్తున్నాడు.]

[చేతులు కడుక్కుంటున్నారు భోజనంచేసి.]

సీనయ్య : భక్తిలేని మనిషే వుండడు. కొందరు దేవుళ్లని పూజిస్తారు. కొందరు దేవతల్ని ధ్యానిస్తారు. కాని ఏ ఆరాధనలో కూడా స్వార్థం వుండకూడదు. అది దేశసేవకి విషతుల్యం.

[సాయంత్రం మీటింగు.]

శోభనాద్రి ఉపన్యాసం యిస్తున్నాడు.

ఈ వూళ్లలో సంఘీభావంలేక, కులాలని, పార్టీలని, ఒకరినొకరు ద్వేషించుకుని, ఇతరులకి దాసులౌతున్నారు. మన దేశపతనమే యీ భేదాలవల్ల జరిగింది. అందరూ ఒకేమాటమీద నిలబడండి ఆపదలు వొస్తాయి. ధైర్యంతో వోర్చుకోండి. జయం

